# PADMAVATHI.

BY

**Chintha Narasimha Reddy,**
Yaddulayyagari Kothapalli.

WITH A PREFACE BY

**Kavisimha D. Rajasekhara Sathavadhani.**



**1927.**

Price.] [0-6-0

# చింతా. నరసింహారెడ్డిగారి

## గ్రంథములు.

| | |
|---|---|
| సుగుణమణి. (అయిదంకములనాటకము.) | 0—8—0 |
| సత్యవతి. (నవల) | 0—8—0 |
| పడకటిల్లు. (నాటకము) | 0—2—0 |
| వలపులేనిపెండ్లి-వగపులపుట్ట. | 0—2—0 |

గ్రంథములువలయువారు:-

చింతా. నరసింహారెడ్డి.
కొత్తపల్లె
సింహాద్రిపురం పోష్టు.
కడపజిల్లా.

లేక,

జనోపకారిణిస్టోర్సు, పొద్దుటూరు. అనిగ్రాయుడు.

---

శతావధానిపంచానన కవిసింహ.

# డి. రాజశేఖరకవిగారి

## గ్రంథములు.

| | |
|---|---|
| వీరమతి. (పద్యకావ్యము.) | 1—0—0 |
| చండనృపాలచరిత్రము. (అచ్చులోనున్నది.) | |
| సీతాకల్యాణము. (నాటకము) | 0—8—0 |
| పద్మావతీవిజయము. (నాటకము) | 1—4—0 |
| వృద్ధి, మూలము సంవాదము. | 0—2—0 |
| (ఒకరూపాయ 120 సం॥లకు రు. 8, 56, 722 లుగాపెరుగుట) | |
| శరన్నవరాత్రపద్యావళి. | 0—2—0 |

జనోపకారిణిస్టోర్సు, పొద్దుటూరు.



# పద్యావళి

—౧

గ్రంథకర్త.

చింతా నరసింహారెడ్డి.

పెద్దులయ్యగారి కొత్తపల్లె.



ప్రొద్దుటూరు జానకీముద్రణాలయమున ముద్రితము.

1927.

# పాత్రధారుల పేర్లు.

(నాటకమునందువచ్చు ముఖ్యపాత్రలు)

1. తేజసింగు— ఉదయపురరాజు.
2. కుమారసింగు— ,, సోదరుడు.
3. భీమసింగు— } ఉదయపురరాజమిత్రులు.
4. లక్ష్మణసింగు— }
5. అజితసింహుడు—కథానాయకుడు.
6. హరిసింగు—అజితునితో మల్లయుద్ధమొనర్చిన వీరుడు
7. జయసింహుడు—అజితుని సోదరుడు.
8. మదనసింహుడు— }
9. రాజసింహుడు — } కుమారసింహుని మిత్రులు.
10. పాండురంగనాథుడు }
11. చంద్రుడు—పద్మావతి మారువేషము నందుండినప్పటి పేరు.

స్త్రీలు.

12. పద్మావతి—కథానాయిక తేజునికొమరిత.
13. కమల—కుమారసింహుని తనయ.
14. కమలిని....కమల మారువేషమునందుండినప్పటి పేరు.



# అంకితము.

శ్రీయుతులు నాకనుంగుమిత్రులై నన్నాదరించుటయెగాక యీపుస్తకము నచ్చొత్తించిన అనంతపురంజిల్లా ధర్మపురి గ్రామవాస్తవ్యులగు మ॥ రా॥ శ్రీ॥ బింకెల మారకాపురంశెట్టిగారి పుత్రరత్నమగు బాలమారకాపురంశెట్టిగారికి నారచించినగ్రంథమును భక్తియై సమర్పించుకొంటిని.

వీరికి దేవుఁడు ఆయురారోగ్యభాగ్యములను పుత్రపౌత్రాభివృద్ధియు నొసంగి రక్షించుఁగాత.

గ్రంథకర్త.
చింతానరసింహాశెట్టి.



# అవతారిక.

---o---

సకల కలావిశారదులగు రసిక జనవరులారా:

ప్రౌఢమగు గ్రంథములు సామాన్యులగు స్త్రీపురుషుల కు దురవగాహంబగుట నెఱింగి యీచిరుగ్రంథమును వ్రాసి తిని. సులభశైలిని చేటమాటలతో వ్రాసిన యీనాటకము ను స్తనంధయప్రాయులగు బాలురవచ్చి రాని మాటలట్లు గ ణించి యిందలిగుణములను బాటించి తప్పులనున్నింపచేయు నాఁడను.

ప్రకృతలోపము లెత్తిచూపినచో నింకను బాగుపడు టకెక్కువ యవకాశము గలుగునని పుట్టెఁడాసతో యీపుస్త కమును వ్రాసితిని. గుణాగుణ నిరూపణము పాఠక మహాశ యులకార్యము. కానఁబాఠకు లిందలి దోషముల మన్నింప వేఁడుచుంటిని.

ఇందలి లోపములసవరించి తొలిపలుకును వ్రాసినా ను ద రించిన శ్రీయుత శతావధానిపంచానన కవిసింహ. డి. రాజశే ఖరశతావధాని గారికి సహస్రవందనము లర్పించువాఁడ.

ఇట్లు

గ్రంథకర్త

# తొలిపలుకు.

"పద్మావతి" యనునది యైదంకముల నాటకము. ఇయ్యది షేక్స్పియరు మతమును ననుసరించి, రంగవిభజనముగల క్రొత్తసంప్రదాయమునకుఁ జేరినది ఇందలి యితివృత్తమాంగ్లకవి సార్వభౌముఁడగు షేక్స్పియర్ మహాకవి విరచితమైన "As you like it" అను నాటకమునుండి గైకొనఁబడినది. కాని నాటకమంతయు నక్షరమున కక్షరము సూటిగాఁ బరివర్తింపఁబడక. కథాభాగము మాత్రము, స్థూలరూపమునఁ గైకొనఁబడియున్నది. ఆంగ్లపాత్రనామములట్లే వాడఁబడక, మన దేశపాత్రముల నామములుంచఁబడినవి కథాపోషణమున కిదియును గుణమగు తోఁచెన

మాతృకలో దేశమునుండి వెడలఁగొట్టఁబడిన మండలాధిపతి. (Duke) ఉదయపుర రాజగు తేజసింగుగను, రాజ్యమునాక్రమించిన యతనిసోదరుఁడు Frederick ఫ్రెడరిక్కు కుమారసింహుఁడుగను, జేయబడియున్నారు. కథానాయికయగు "Rosalind" రోసలిండు పద్మావతిగను, భ్రాతృద్రోహియగు ఫ్రెడరిక్కుకుమారిక "Celia' సిలియా కమలగను వ్రాయఁబడియున్నారు. మిగిలిన పాత్రములు యథార్థస్థితిని నిరూపింపఁబడినవి.

ఈచిన్ని నాటకమును విరచించిన చి॥ చింతానృసింహా రెడ్డిగారు మాకు సమీపమునసుండు పులివెందుల తాలూకుకుఁ జేరిన క్రొత్తపల్లెగ్రామనివాసి సంపన్నమైన రెడ్డి వంశమున జనించిన పిన్నవాఁడు. ముద్దుటుంగరముల గోత్రము గలవాఁడు. ఆంగ్లమునఁ బ్రవేశపరీక్షకు వెడలియుండెను. ఆంధ్ర

భాషయందు మిక్కిలియభిరుచి గలవాడు. ఈతని గ్రంథమున వచనములు ముద్దు ముద్దుగఁ దనరారు చున్నవి. అందందు బద్యములు సంతోషము గొలుపుచు నెలకొని యున్నవి. అంకమున కంకము రసపోషణమునఁ దీసిపోక విలసిల్లుచున్నది. శైలి ప్రదర్శనార్థమై యొకపద్యము నుదాహరించుచున్నాను.

సీ॥ నిండుచందురుఁ బోలు నీముద్దుమోమిట్లు
వాడియుండఁగ నేల వనజనేత్రి
గండుతుమ్మెదఁ బోలు కలికినీకురులిట్లు
మాసియుండఁగ నేల మంజువాణి
చొక్కంపుబంగారు సోయగంబుల మేను
చిక్కియుండఁగ నేల చిన్నెలాఁడి
కష్టంబులన్నిక్క కాయంబు డయ్యంగ
కారణం బేమొకో కంబుకంఠి
తే॥ గీ॥ అమ్మ యీరీతి నీవేల యలసితొక్కొ
మన్మథానలసంతప్త మానవగుచు
సజతుఁ దలఁచుచునుంటివే యబలనీవు
నీదుకోరిక సిద్ధించు నిక్కముగను॥

సుగుణగణము లెక్కింపఁగల యీకవి యింకను జనంగలకవిత్వములవఱచుకొని గ్రంథములు వ్రాసి యాంధ్రభాషా యోపాయనముల నర్పించుఁగాక. భగవంతుఁడీతని నాయురారోగ్యసముపేతు నొనరించుఁగాకయని ప్రార్థించుచు నింతటితోను విరమించుచున్నాను.

కవిసింహ డి. రాజశేఖరశతావధాని

మ॥ రా॥ శ్రీ॥ చింతానరసింహారెడ్డి గారికి, ఆర్యా!

ఉ॥ భావములెన్నొ మేఘముల, భాతిపసంపడి వచ్చుచుండ పం
భావన జేసి చక్కగను, భాతిరచించిన రూపకంబు ప
ద్మావతి నాగ నొప్పునది, సద్యముకోపదలోక నుత్యమై
శ్రీవిలసిల్లు చింతనరసింహ కవీశ్వరు పేరు భాసిలన్

తే॥గీ॥ చింతనరసింహారెడ్డి విచిత్రముగ ర
చించినట్టి పద్మావతి చిన్నదైన
భావములచేత బెద్దదై పరిఢవిల్లు
చెలువుగూర్పు పెశశిరేఖ, చిన్నదైన

పిఠాపురము.
12-2-27

ఇట్లు మిత్రుడు,
ఉమర్ అలీషా.

మ॥ రా॥ శ్రీ కె. సి. నరసింహారెడ్డిగారికి:

పులివెందుల తాలూకా ఎద్దులయ్యగారి కొత్తపల్లె శ్రీయుత చింతా నృసింహారెడ్డిగారిచే విరచితంబైన పద్మావతినాటకముం బఠించి ప్రమోదితాంతరంగుడనైతి. ఇయ్యది యాంగ్ల కవిశేఖరుండగు షేక్స్పియరు (Shakespere) రచించిన "నీవు వలచినయట్లు" (As you like it) యను నాటకమునకు సరియైన యాంధ్రీకరణ నాటకరాజము. ఈకవితసమాంగ్లాంధ్ర యుభయభాషాపాండిత్యమును వెలిబుచ్చెననుటకెద్దియు సందియంబావనము. ఇందలి పద్యములు శ్రోత్రపేయములు. శైలిమృదుమధురము. లలితపదజాలంబును, సమానాలంకార రసపోషకంబును, వినూత్నభావములును, కవిగారి నైపుణ్యమును జాటుచున్నవి. ఈరూపకరాజ మతిశీఘ్రకాలమున నభివృద్ధినొంది యాంధ్రభాషామణికిం వన్నెదెచ్చి రెడ్డిగారి శాశ్వతకీర్తిని నిలుపునని నామనోనిశ్చయము.

పులివెందుల.
14—12—26.

ఇట్లు,
యల్. వెంకటరమణయ్య.

# ఇష్టదేవతాస్తుతి.



ఆ॥ వె॥ వనరుహాప్తవంశ పాథోధివిధుఁడవై
భువనజాలమెల్లఁ బ్రోచునిన్ను
దశరథేంద్రతనయ! తలఁచికీర్తించెదఁ
గ్రోత్తపల్లివాస! గుణవికాస!

ఉ॥ భూవలయంబుగావ నిలపుట్టిన విశ్రుత విక్రముండవై
పావననామనీదు పరిపంథులద్రుంచిన మేటివీరనే
నీవిధవ్రాయఁబూనితిని నీదయనాయెడ నెల్లవేళలన్
దేవతసర్వజేసిఁ కరుణింపుమటంచని నిన్నువేఁడెదన్॥

పాట.

భవజలధితరణిరామ, పవనాత్మజనుతరామ, రవికోటి దీప్తిధామ, అవనీజామనఃకాము॥ భవ॥

ముఖకాంతివిజితసోమ, సకలేశపరంధామ యికనైన బ్రోవుద్రేను యకలంకఘనశ్యామ॥ భవ॥

భువినిన్నుఁ దలచువారు నైవస్వతుఁగనఁబోరు భవ దూరులగుచుదారు పావననింజేరెదరు॥ భవ॥

వరసూర్యకులజబాల, ధరనూత్నసగరపాల పరమాత్మచలంబేల పరిపూర్ణకీర్తిజాల॥ భవ॥



గ్రంథకర్త.

# పద్మావతి.

## నాంది.

ఉ॥ నందతపఃఫలంబు సుగుణంబులపుంజము గోపకామినీ
బృందమునోముపంట సిరివిందుదయాంబుధి యోగిబృం
దముల్
డెందములందుగోరెడు కడింది నిధానముకంసహారియిం
పొందగమీకునిచ్చుతను పొలగసౌఖ్యము లెల్లవేళలన్ ॥

(నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశించి.)

నాటకదర్శన కుతూహలాయత్తచిత్తులగు బుధోత్త
ములు కాలహరణంబునకై విసుగుజెందుదురని భయభ్రాం
తుఁడనై త్వరితముగఁ జనుదెమ్మని నేనెంతవేడినను నాసతి
యగు నటి యింతవఱకును రాకున్నదిగదా (తెరవంకఁజూ
చి) నటీ! ఏమి యీయాలస్యము. త్వరితముగఁ జనుదెమ్ము.

నటి:—ఆర్యా! ఇదే యరుదెంచితిని. నాయాలస్యమునకు
మన్నింపుము.

సూత్ర:—నిన్ను మన్నింప నేనెంతటివాడను. స్త్రీలు కేవల
ము జడమతులు. కల్యాణీ! ఈజనసముదయము నాటకద
ర్శనమునుఁగోరి తీవ్రపడుచుండిరి. యేదేని యొక్కనవీన
నాటకంబాడి యీసభ్యుల సంతసింప జేయవలయునుగ
దా

నటి:—నాథా! రసికాగ్రగణ్యులగు వీరిమనముల రంజింపఁ
జేయఁజాలు యొకనాటకమునుఁ బేర్కొనుడు.

సూత్ర:—కల్యాణీ! ఆంగ్లకవి సార్వభౌముండగు షేక్స్పియర్ రచించిన "యాజ్ యు లైక్ యిట్"న కనువాదంబగు "పద్మావతి" యను నాటకమునుఁ బ్రదర్శించిన నెంతయు బాగుగనుండెడిది.

నటి:....మనోహరా! గ్రంథకర్త యెవ్వరు?

సూత్ర:—ప్రేయసీ! తెల్పెదను వినుము.

తే| గీ॥ ధరణినూత్నపురంబునఁ దనరునట్టి
ముద్దుటుంగరముల గోత్రమున జనించె
రామభక్తుండు సౌమ్యుండు రామవినుమ
కవితయొనరించె నరసింహ కవివరుండు॥

నటి:—వీరు కేవలము బాలురగుటచే రచనానైపుణ్య ముండదని నాయభిప్రాయము.

సూత్ర:—నిక్కము వచించితివి. వీరు పండితులుగాకున్నను లక్షణయుక్తముగ నీగ్రంథమును వ్రాసియుండిరి. కవిపండిత సంఘము యితనితప్పుల తప్పక మన్నింతురని నాకు నమ్మకముగలదు. కాన యీనాటకమునే ప్రదర్శింతము.

నటి:—నాథా! అటులనే కానిమ్ము. ఇంక మనము పోదము రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు).





శ్రీరస్తు.

# పద్మావతి.

## ప్రథమాఙ్కము-ప్రథమరంగము.

ప్రవేశము:—కుమారసింగు మిత్రులతో.

కుమారసింగు:- మిత్రులారా! నాకు సర్వకాలములయందు తోడునీడలై నేతలంచిన కార్యములనెల్ల సామదాన భేద దండ చతురుపాయములచే కొనసాగించుచుంటిరి. మదీయాగ్రజుఁడగు తేజసింగు తనసుగుణములచేత రాజ్యమందు పేర్వడసియుండె. కొన్నాళ్లిటులనే మనమూరకున్నచో కడపట మనకు నిలువనీడయైన నుండదు. మిత్రులారా! ఎటులయిన నవ్వీరునిఁ మట్టుబెట్టి రాజ్యమును నేనుగైకొన్నచో మనము నిరాటంకముగ నుండవచ్చును. మీరు సర్వసౌఖ్యముల నందగలుగుదురు. ఇందుకు మీరు నాకుతోడై నాకోరికెల తీర్పఁజనును. మీయభిప్రాయములఁదెలిపి నన్ను ధన్యునిఁజేయుడు.

మదనసింహుఁడు:-కుమారసింహా! మీరీగతి చింతించనేల. సర్వసైన్యములకు నేను సైన్యాధిపునిగాయుండ. యింతటి స్వల్పకార్యమునకై మీరింతాలోచింపఁజనునే. నాచేతులార రాజునుఁజంపి నిన్ను సింహాసనాసీనుఁజేసి యీరాజ్యం బేలించువాఁడను.

తే॥ గీ॥ కట్టయీరీతిచింతింప కార్యమాన్న
దురమునందున తేజునిఁ దునిమినేను
నిన్నురాజుగ జేతునే నిక్కముగను
నాదుశక్తిని నీవేల నమ్మవకట॥

రాజసింహుడు:- మిత్రమా! మదనసింహుడు దురమున తేజుఁజంపి నిన్ను సింహాసనాసీనుఁజేతునని చెప్పెడిని. అయ్యది సాధ్యమయినను సమరమొనర్ప కారణమొకింతయేని లేదు. ఒకవేళ యుద్ధమొనర్చియే తేజసింగునుఁ బరిమార్తుమన్న లోకులు మన దుస్స్వభావమున కెంతయు విసుగుజెంది మనల కడుచులుకగాఁ జూచుటయేగాక ఆబాలవృద్ధముగ మనల ఘాతుకులగానెంచి తిట్టకుందురే. అప్పుడు మనకున్న పరువుమర్యాదలెల్ల నసించును. కాన త్వరపడి కార్యమొనర్పరాదు. తేజసింగు సద్గుణములకెల్ల నిలయమగుటచే ప్రజలెల్లరు కన్నతండ్రిరీతిగఁ జూచుచుందురు. రహస్యముగ తుదముట్టింప త్రోవ వెదుకవలయునేగాని బహిరంగముగ కార్యమొనర్పఁజనదు.

మదనసింహుఁడు:- రాజసింహా! పిఱికిపందఁబోలి యీరీతి మాటాడఁజనునా. రహస్యముగ చోరునిరీతి చంపవలయునన్న నాకిసుమంతయేని సమ్మతిలేదు.

తే॥ గీ॥ తుచ్ఛముగ తేజు వధియింప నిచ్ఛలేదు
పాపకార్యంబుగాదొక్కొ తోపలేదొ
దొంగరీతినిజంపుట దోషమంచు
పిరవరులకు నీమాట విసుఁగునించు॥

## ప్రథమాఙ్కము.

వీర్యాగ్రేసరుండనగు నాకు నీమాటలు రుచింపకున్నవి. సర్వవిధముల సమరమేయొనర్పఁజనును. సర్వసైన్యము నాయధీనమునందున్నది. నిక్కముగ జయముమనకు చేకురును.

పాండురంగనాథుడు:- రసపుత్రవీరులు శౌర్యవంతులగుటచే యుద్ధమన్న కడు చులకగాదలంతురు. కాని, అందలి నష్టములఁ దలంపరు. మదనసింహుని వాక్యములు పౌరుషానలమును గురిపించుచుండెనేగాని కార్యగౌరవమును మఱచినవి. జయసింహునిమాటలు మిగుల ప్రశంసనీయములు. ప్రస్తుత స్థితిగతులఁదలంచి చూచినచో యెవ్విధినైన తేజుని రహస్యముగ వధించి రాజ్యమునుఁ గైకొనుటయే సమంజసముగఁ గన్పట్టెడు.

కుమారసింగు:- మిత్రులారా! మీమాటల శ్రద్ధతో వింటిని. కాని, నాకుజూడ తేజసింహుని మాయలఁబన్ని రహస్యముగ రూపుమాపుటయే రాజనీతిగాని గర్వించి రాజగు తేజసింగునెదిర్చి నిలుచు టనర్థదాయకము. మదనసింహుఁడు యువకుఁడును పౌరుషవంతుడునగుటచే యుద్ధమొనర్పఁజనునని చెప్పెడు. నాకాతనిమాటలు రుచించుటలేదు. ఎట్టులయినను కార్యమును రహస్యముగ కొనసాగింప వలయును. మిత్రులారా! యిందుకుతగిన యాలోచన మొనర్పుడు.

పాండురంగనాథుడు:- నృపకుమారా! నేనింతవఱకే యీ కార్యము నాలోచించియుంటిని. ఎఱుగుదువుగదా. రాజుగారి

వంటలవాఁడగు సోమసింగును నేవానితో రహస్యముగ మాటాడియున్నాను. వేయినిష్కములొసంగుచో పచనమొనర్చునపుడు అన్నమందు విషమిడి మనకార్యమును నెఱవేర్చును. సర్వవిధముల మనకార్య మనుకూలించును.

కుమారసింగు:- మిత్రమా! అటుల నేయొనర్పుము. ఇప్పుడే యీవేయిరూప్యములఁ గొనిపోయి వానికొసంగుము. మన కార్యమును కడుజాగరూకతతో చేయుమనుము. మిత్రులారా! యీకార్యమును కడురహస్యముగ నుంచవలయును. ఇతరులకేరికైనఁ దెలిసినచో మనకార్యము విఫలమగుటయేగాక మనకుకష్టములుకూడ కలుగవచ్చును. హెచ్చరికతో నుండవలయునుసుమా. (నిష్క్రమింతురు.)

(ప్రథమాఙ్కము-ద్వితీయరంగము.)

తేజసింగు:-(స్వగతము) ఔరా! కాలమహిమ. తలిదండ్రులను నిజసోదరులను ఆప్తబంధువులనుఁగూడ నమ్మరాకున్నది గదా. రాజ్యకాంక్షయెంతచెడ్డది. నానిజసోదరుఁడు నన్నుఁజంపి రాజ్యమాక్రమించ ప్రయత్నించుచుండెనని విన్నప్పటినుండియు నాకీప్రపంచమె కడునింద్యముగా తోచుచున్నది. కరుణామయుండగు దేవుఁడు మానవుల కింగితజ్ఞానం బొసంగుట యిందులకేనా. నీచబుద్ధిగల మానవజాతికన్నను నోరులేని పశుపక్ష్యాదులెంతయో యుత్తమములుగదా! ఇట్టిసోదరునినమ్మి యింటనుండుటకన్న రాజ్యమునువదలి ఘోరవిపినంబులయం

ను నివసించుటయే మేలు. చిన్నతనముననే తలిదండ్రులు గతించుటఁజేసి సోదరుడయినను కన్నకొమరునిరీతిగ లోపము లులేకుండఁ బెంచినందులకుగా నన్నిపుడీనీచుఁడు తుదముట్టింప నెంచుట. ఈపట్టణమునువదలి హారావళీపర్వతారణ్యముల లో నివసించుటయేమేలు. (ప్రకాశము.) మిత్రమా! భీమసింగూ! నా రాజ్యము నాక్రమింపనెంచి నాసోదరుఁడునాకు కీడు చేయతలంచుచుండెను. రాజ్యకాంక్షచే నాసోదరునకు కీడు చేయ నామనసమంగీకరించుటలేదు. కానసేనీ పట్టణమునువదలిపోవనుంటిని.

భీమసింగు: ఏమీ! పరమసుగుణమూర్తివలెఁ గాన్పించు కుమారసింహుఁ డంతటిపాపియా. ఔరా కుమారసింహా!

తే। గీ॥ అన్నయని నీవు మనమున నెన్నకకట
తేజసింగును వధియింప తెగువనీవు
తలచుటలుజూడ ఘోరంబుతలచినంత
మనము వ్రయ్యలుగానుండె మాకుగూడ॥

తేజసింగు నీకన్నయగుటయేగాక నీకు పోషకుండును అధీశ్వరుండునగుట అవ్వానిఁజంపి నీవంశమునకు కళంకము తేనుంటివిగా.

తే। గీ॥ తండ్రి స్వర్గంబుజేరంగ తండ్రికంటె
నిన్నుకృపతోడ బోషించి నీతిగఱపి
యింతవానిని జేయుట కిదిఫలంబె
ధర్మపథమును తప్పుట తగునెనీకు॥

తే॥ గీ॥ పామునకు పాలుబోసిన పగిదియయ్యె
నిన్ను బెంచుటలెల్లను నిక్కముగను
పాపి యీరీతిజేయంగ పాపమనుచు
మనమునందున దోపదో మఱచినావొ॥

తే॥ గీ॥ పాలవంటికులంబున పరమనీచ
జన్మమెట్టుల గాంచితో జగతినీవు
నీదుపేర్విన్నయంతనె నిక్కముగను
మండుచుండెను నాదగు మానసంబు॥

'పాపీ! శూరుఁడగు యుదయసింగునకుఁ జన్మించి తేజసింగునకెల్లనుజన్ముండవైతివి.

ఉ॥ కోరగరానికోర్కెలను కోరగజెల్లునె యెప్పుడేనియుఁ
శూరుడు తేజుడంచు మదిసుంతయు నెంచకరాజ్యకాంక్షచే
క్రూరుఁడదుష్టచిత్తయిటు క్రూరతసోదరుజంప నెంచితే
ఆరయపాపమంచు మదికక్కటదోపదె యింతయేనియుఁ

రాజ్యకాంక్షచే పాపమునకుఁ జంకక నీచత నీసోదరుఁ జంప నీమనంబెట్లంగీకరించె. క్రూరాత్మా! నిన్నుఁజంపి నీ కండల కాకఘూకంబులకు విందొనర్చినను దోషంబులేదు గదా. తేజుఁడు సాధుస్వభావుండగుటచే యింతవఱకు నోర్చియుండె. తేజసింహా! నీదయాళుత్వమే నిన్నింతకుఁదెచ్చినది. క్రూరుఁడగు కుమారసింహుఁడు రాజద్రోహియగుటచే నాత

నిచెఱయందుంచ నాజ్ఞయొసంగుము. నేనిప్పుడే సమిత్రంబుగా వానినిఁ బంధించి చెఱయందుంచెదను.

తేజసింగు:- మామా! బాలుఁడగు కుమారసింహునిపై నలుగఁజనదు. వాడయీరాజ్యమును పాలించనిమ్ము. నేను నిక్కముగ నడవులయందుండ నెంచితిని.

తే॥ గీ॥ మామ అడవులలో నేను మనెదువాడ
వాడె రాజ్యంబు బాలించ వదలి నేను
నీవు నీతుల గఱపుచు నిలుఁవుమిచట
పోయివత్తును సెలవిమ్ము హాయిగాను॥

సీ॥ తన్ను గాచినరీతి దయయుంచినాదగు
తనయ నెప్పుడు బ్రోవ మనగదయ్య
తల్లిదండ్రులు లేని తరళాక్షియని నీవు
కనికరంబున జూడ గఱపుమయ్య
రాసుతయని నీవు రక్షింపకుండుట
భావ్యంబుగాదంచు పలుకుమయ్య
నామీఁదికోపంబు నాసుతపై జూప
వలదంచు నీతులఁ దెలుపుమయ్య
తే॥ గీ॥ నీదుసుతరీతి నినునామె నిక్కముగను
తలచునంచని చెప్పుము దయతో నీవు
అప్పగించితి నాసుత నతని కేను
కాచిరక్షించి కీర్తిని గాచుమనుము॥

మామా! చిన్నతనముననె తల్లిఁగోల్పోయి నన్నె సర్వంబుగానెంచియున్న నాసుతను తన తనయగా తలంచి రక్షించుమనుము. ప్రజల కన్నబిడ్డలరీతి నరయుమనుము. దుర్మార్గుల దూరముదోలి సన్మార్గులచెల్మిఁబొనర్చి రాజ్యమును పాలించమనుము నేను రేపుదయమున పట్టణమును వదలిపోవ నుంటిననుము.

లక్ష్మణసింగు:- రాజచంద్రమా! నేనుమాత్రము-నిన్నువ వలి యీక్రూరునిసరస నుండఁజాల. నేనునుమీవెంట నే వ చ్చువాడను. అనుగ్రహింపఁజనును.

తేజసింగు:- మిత్రమా! అటులనే కానిమ్ము.

(ప్రథమాజ్కము-తృతీయరంగము.)

ప్రవేశము:—కుమారసింహుఁడు.

తేజుఁడు తెగువజేసి రాజ్యమునువదలిచనిరొ. అతనినె నువెంటనే యొకరొకరుగా అతనిమిత్రులెల్లరు పట్టణమునువద లిచనిరి. ఇంక నాకేలాటి భయమును లేదు. కత్తిఁజూపి రాజ్య మునుఁ బాలించెదను. భీమసింగు నాకునీతులఁగఱపుచు యిచ టనే యున్నవాడు. తేజుని కొమరితయగు పద్మావతిని మాత్ర ము నాకన్న సుతరీతిగనే పోషింపఁజనును. తేజునిమిత్రులయె డమాత్ర మొకకన్నుంచియే యుండవలెను. మదనసింహుఁడు సైన్యాధిపుడుగాను, రాజసింహ పాండురంగనాథులు మం త్రులుగాను నన్నుగొల్చుచుండెదరుగాక.

పఠమాజ్కము.

తే॥ గీ॥ తేజువెనువెంటఁబోయిరి తెగువచేసి
అతనిస్నేహితులందేరు నరయవేరు
నాదుమిత్రులు గొల్వంగ నయముమీర
రాజ్యపాలనమును జేతు పూజ్యముగను॥

---

(ద్వితీయాజ్కము-ప్రథమరంగము.)

ప్రవేశము:-జయసింహుఁడు.

వీరుఁడగు నజితసింహునిఁ దలంచినపుడంతయు నా గుండెలు ఝల్లుమనుచుండెను. మొన్నటిదినమున వేటకరిగి న పుడు కొదమసింగమునొకదాని నెదిరించి కూల్చె. ఔరా! వాని పౌరుషంబు.

తే॥ గీ॥ కొదమసింగము నొకదాని గూల్చెవాడు
నాటినుండియు భయము డెందముననుండు
ధీరసర్పంబు నగుటచే దినదినంబు
వన్నెకెక్కుచు నున్నాడు వసుధలోన॥

ఇంటనుండెడు సేవకులన్ననో పెద్దవాడనగు నన్ను గౌరవించక అజితుని దైవముగాభావించుచు పూజించుచు వెన్నంటియుందురు.

తే॥ గీ॥ దైవమునుబోలె వానిని దలతురకట
నాకుమర్యాదజూపరు నాదుజనులు

పెద్దవాడనటంచునే పెక్కుగతుల్
తలచుచుంటిని మదినేను తథ్యముగను॥

వయసున పెద్దవాడనేగాని వానికుండెడు మర్యాద నాకు లేకున్నది గదా. ఇందుకునేనేమని వగవఁ జనును. పట్టణము నందెచ్చట జూచిన నజితుని మిగుల పొగడుచుందురు. నన్నాకరుగాని తలంచువారు లేరైరి గదా యిందుల కేమన నలయు. రహస్యముగ యీనీచుని తుదముట్టించునచో నాకు మర్యాదయుండునేగాని లేకున్న నాకుమర్యాద యుండదు.

తే॥ గీ॥ ఎట్టులయిననే నజితుని మట్టు బెట్టి
ఖ్యాతిగాంచెద భువినేనఖండలీల
పాపమునకునే జంకిన పట్టరాని
కష్టవితతులు నాకును గలునిజము॥

ఉ॥ ధీరుడువిక్రమాఢ్యుడును ధీనిధియైచెలువొందువానినే
ధీరతజంపకున్న కడుదీనతవానిని గొల్వగావలెఁ
సారయశోగుణాకరుడు సత్యమువానిని ద్రుంపకున్నహా
తీరనిబాధలెన్నొ భువితీంద్రములయ్యును నన్నుజంపవే॥

ఎట్టులయినను వానిని మట్టుబెట్టియేతీరవలయు. ఇందుకుగా తగినప్రయత్నము లొనరించెదఁగాక.

(నిష్క్రమించును.)

(ద్వితీయాఙ్కము-ద్వితీయరంగము.)

## ద్వి తీ యా ఙ్క ము.

ప్రవేశము పద్మావతి-కమల.

కమల:- సోదరీ! నీవీగతి వ్యసనాక్రాంతవై యుండనేల. సంతసమొకప్పుడేని నీముఖమునం దగుపడదుగదా, పూర్ణిమా చంద్రుడైన ధిక్కరించగల్గు నీముఖమేల సర్వకాల సర్వావస్థలయందును వాడియుండును. మాతండ్రి నీ కెట్టిలోపములం గలిగించక పోషించుచుండెనుగదా.

తే॥ గీ॥ అమ్మ యీగతి చింతింప నగునె నీకు
నిండుచందురు బోలెడు నీదు మోము
కళలబాసియు నుంటచే గాంచలేను
సకియ సంతోషమునుజూప సంతసింతు॥

ఉ॥ చూడవదేమిగారవపు జూపులయిట్లు పడంతినీవు మా
టాడవదేమి కారణము అక్కట పాపము జేసినానొ నే
డాడవదేమి నిన్నువిడనాడగజాలను సత్యమింతయు౯
కూడవదేమిఆటలను కోపము జెందగనేల చెప్పుమా॥

అమ్మా! నన్ను ప్రేమతో చూచెడు చూపులు నేడే మూలలం దాగియుండె. వీణెనుసవరించి నేవేలపాడనిచ్చగింపవు బొమ్మలాటలాడనురావేల. నేజేసినతప్పైననేమి. నిన్ను, సోదరీ! నామనసారం బ్రేమించుదాననగుటచే నీవిట్లుండ నేనొకనిమిషమేని తాళగాలనా?

పద్మావతి:- కమలా! బేలవై యేలయీరీతినన్ను ప్రేమిం

చెడవు. నీవురాక్షోమరితవు. నేనన్ననో దిక్కులేని యొకదీను రాలను. కుక్షింభరత్వమునకుగా మీయింటనున్నదాన. నన్ను నీవేల యింతయెక్కువగా ప్రేమింతువు. నా తల్లిగతించిన నా టినుండియు నాతండ్రియె సర్వంబుగానెంచియుండ నాతం డ్రి యీపట్టణమును నీతండ్రి దుర్మార్గమువలన వదలిచనియె. ఆసంగతిని తలచినపుడంతయు నామనము నిట్టనిలువున నీర గుచు భరింపరాని వ్యసనము నన్ను బాధించుచున్నది.

ఉ॥ కానగనీదుతండ్రి సఖి కానలకంపెనునాదుతండ్రినిఀ
మానుగనన్నునీవిచట మన్ననజూచుచునుంటవక్కటా
చానరొనాదుకష్టముల చయ్యన దెల్పెదినింతయేనియుఀ
మానసమొందదయ్యె గనమానుగసౌఖ్యముయేమి దెల్పు
దుఀ॥

సోదరీ! నీతండ్రి నాతండ్రిని అడవులకుఀబంపి నాకు తీరరానివ్యసనమునుగలిగించె. తులలేని వైభవములొందుచుం డిన నాతండ్రి అడవులయం దేవిధముగ నున్నవాడోగదా!

కమల:- అక్కా! "ధర్మమేవజయతి" యన్నట్లు ధర్మమె ప్పుడును జయమునేగాంచును. అధర్మపరులు వ్యసనమునుజెం దుటయేగాక పరమున బహుబాధల నొందవలసియుండును. తండ్రియని నాతండ్రియొనరించిన యపరాధముల నేసమ్మతిం తుననియానీభావము. నేనునీవలెనే ముగ్ధనగుటచే నతని దండిం పజాలకుంటిని. ధర్మస్వరూపిణివగు నీవు కామక్రోధ లోభా

న్యరిషడ్వర్గములకు దాసివగుటచెల్లునే. నాతండ్రి నీకేవిధము నఁగాని లోపముకలిగించుటలేదుగదా. తల్లీ నాతండ్రిమోస రించిన పాపమునకుగా నాపైనలుగజెల్లునే. సంతసమొందుము.

(ప్రవేశము-సేవకుఁడు.)

అమ్మలారా! నేడు రాజసభవద్ద మన యాస్థానమల్లుని తో నొకవీరుడు మల్లయుద్ధమొనర్పనుండెను. చూడనిచ్ఛగ లచేని మిమ్ములమ్మని రాజుగారు సెలవొసంగిరి.

కమల:- సేవకా! మేము నిక్కముగారానుంటిమి. కాన మాకు తగుస్థలమేర్పాటుచేసి యుంచుమనుము.

సేవకుడు:- అమ్మా! అలాగేవిన్నవించెదను.

(నిష్క్రమించును.)

ద్వితీయాఙ్కము—తృతీయరఙ్గము.

ప్రవేశము—అజితసింహుఁడు.

నాసోదరుడు నాయెడజూపు నసూయవలన నామనము చెప్పరానివ్యసనములకుఁ గురియగుచున్నది. సోదరుఁడని ప్రే మనుజూపక నన్నీగతిబాధించుటచే నాకు ప్రాణములమీఁది యాశలన్నియు నడుగంటుచున్నవి. అందుచేతనే నాశక్తినైన గమనించక వీరవరుఁడగు హరిసింగుతో మల్లయుద్ధమొనర్ప ప్రతినబట్టితి. అపజయంబొంది గతించినచో యంతకన్నమేలే మియులేదు. లేక వానినేజయించినచో నాకుగల్గుకీర్తి యాచం

దాగ్రక్కమునిల్చునుగదా. కాన ఇదేరాజసభఁ జేరెదనుగాక.

(రాజసభముందర అజితసింహుడు హరిసింగుః ప్రవేసింతు రు. జనులెల్లరు క్రిక్కిరిసియుందురు. పద్మావతి కమల కు మారసింహుడు ఆసీనులై యుందురు.

**హరిసింగు:-** బాలకా సింహము నొకదానినిజంపినంతనే వీరుడననియెంచి నాతో మల్లయుద్ధమొనర్పవచ్చితే. నాశక్తినిగ న్నతంనే యీదేశమందలివీరులెల్లరు నాకుకానుకలిచ్చి శరణు జొత్తురు. మన్మథాకారా! కోమల దేహుండవగు నీవు నాదెబ్బ లకుతాళగలవా. నిన్నుచూచినప్పటినుండియు నీతో మల్లయు ద్ధమొనర్చి నిన్నుజంప నామనమంగీకరించుటలేదు కాన, నీ యుద్యమమును వదలుకొనుము. నన్నుశరణువేడుము. శరణా గతుల నేజంపువాడనుకాను.

తోటకవృత్తము॥ సారమృగేంద్రము జంపుటచేతన్
వీరుడనంచిటుబీరముజూపన్
ధీరుడవీరుడధీబలశాలిన్
పారకనిల్వుము పట్టెదనిన్నున్॥

కాదేని పారకనిల్వుము. నిన్ను యమపురికిఁబంపెద.

**అజితసింహుడు:-** ఆర్యా నీవిక్రమమునేనెఱుంగనిదికాదు. నన్నుమాత్రము కడుచులకనగా తలంపకుము. మాటలవలన లాభమొకింతయులేదు. కంచుమ్రోగునట్లు కనకముమ్రోగ దు. నీశక్తినిఁజూపి నన్నుజయింపుము.

## ద్వితీయాఙ్కము.

కుమారసింహుఁడు:- బాలుఁడగువీఁడు వీరుఁడగు హారిసింగు తోఁ బోరాడజాలునే.

పద్మావతి:- సోదరీ! కమలా!

ఉ॥ చూడుముసుందరాంగియటు సుందరరూపుడువిక్రముండు హా। వాడటనిల్చియుండె కని వారిజనేత్రిలు మెచ్చుచుండ గ౯! చూడగనామనంబుసఖి సుందరుజేరియె పోవుచుండెగా। వీఁడు మనోజుకన్నఁ బదివేలవిధంబుల మిన్నయాఁ జుమీ॥

అవ్వీరుని యాజానుబాహువులు. ఆకర్ణాంతవిశాల నయనములు విశాలమగు యురంబునుఁగాంచిన నెట్టికాంత యేని ప్రేమించకుండునా.

కమల:- నిక్కముగ యిట్టిసుందరుని నేనిదివఱకుఁ జూచినది లేదు. ఇట్టిరూపవంతు లరుదుగజన్మించుచుంద్రు. నీవతనిఁ గోరుట నాకెంతయుసమ్మతంబు. కంతుజయంతవసంతాదుల లోఁ నొకఁడీగతి మారువేసమున యిటకరుదెంచి యుండెను కాబోలు. కాక, యట్టిరూపమును యింతవఱకు నేనేమానవు లందైనను కనినదిలేదు. సోదరీ! అదేవారు డీకొనుచుండిరి. అటుచూడుము. ఔరా! వానిరణకౌశలంబు. కేవలమువీరుడగు హారిసింగునుఁగూడ భయమొందఁజేయుచున్నాడు.

తే॥ గీ॥ వీరుడగుహారిసింగును విడువకతడు
పట్టికొట్టుచునుండెను దిట్టముగను

ధీరుడగుటచే వానికీదినమునందు
జయమునిక్కము సిద్ధించు జనులుబొగడ॥

నిక్కముగ నాసుందరునకే జయముగలుగును. అల్లడ
కనుగొనుము. హరిసింగునేలకొరిగెను. హా! చచ్చెనుచచ్చెను.

కుమారసింగు:- బాలకా! నీపౌరుషం బమానుషంబు. ని
న్నుగన్న తలిదండ్రులెవ్వరు. వారునిన్నుగాంచుటచే ధన్యు
లైరి. ఇదేయీబహుమతిఁ గైకొమ్ము. (అనిస్వర్ణపతకమునొ
సంగును. అందరు కరశబ్దములఁ జేతురు.

అజితుడు:- రాజచంద్రమా! నేను రాజునకాంతరంగిక మి
త్రుఁడనై యుండి గతించిన మానసింహునికొమరుడ. అజితసిం
హుఁడ నెడివాడను.

కుమారసింహుడు:- అవ్వీరుడు పౌరుషవంతుడేగాని నా
విరోధియగుటచే సత్కరింపనర్హుండుగాడు. (అనివెడలి
పోవును.)

పద్మావతి:- ఇట్టిపరాక్రమశాలికి నేనేదేని యొకబహుమ
తి నొసంగనెంచితిని. ఇదేనాకంఠమునందుండు యీముత్తి
యముల హారము నొసంగెదను. (అని ముత్తియములహారము
ను అజితునిమెడలో వేసి నిష్క్రమించును)

తృతీయాఙ్కము—ప్రథమరంగము.

ప్రవేశము—జయసింహుఁడు:- ఔరా! అజితునిపరాక్ర

మంబు. కొదమసింగమును గూల్చుటయేగాక హరిసింగంతటి మేటిమల్లుని జయించి పేర్వడసె. నాటినుండియు నామనము మిగులవెతనొందుచున్నది. ఎట్టులయినను యీనీచుని తుద ముట్టింపవలెను.

తే॥ గీ॥ వేటకరుగంగ యానాఁడు వేడ్కతోడఁ
గొదమసింగము నొకబాని గూల్చెవాఁడు
నేఁడువీరుని హరిసింగు నేర్పుతోడఁ
జీల్చిచెండాడి కీర్తిని జెందెవాఁడు॥

ఇన్నిజూచి నేనోర్వఁగలనా. నిక్కముగ నేటిరాత్రి వానిగదికి నిప్పంటించి కూల్చెదనుగాక. అప్పుడుగాని నామన మునకూరటగలుగదు.

ప్రవేశము—అజితసింహుఁడు.

జయసింహుఁడెంతటికౄరుఁడు. నేవానికేఁజేసిన ద్రోహమేమి. వాఁడు నాగదికగ్గిముట్టించి చంపనెంచుచుండె. పాపాత్ములకు నీతియనునదిసున్న. నీచబుద్ధితో నన్నుఁ జంపయత్నించె.

మత్తకోకిల॥ తండ్రిచావఁగనేనువానిని తండ్రిరీతిగనెంచితిఁ
గొండరీతిగనేనువానిని కోరిగొల్చుచునుండఁగా
నెండమావులనమ్మినట్టుల యెంచిచూడగవానితో
భండనంబునవానిజంపుట పాపమంచనినుంటిగా.

తండ్రిచచ్చినదిమొదలు అతనినే తండ్రిగానెంచి ప్రే

మించుచుంటిని. వీనినమ్ముటలెల్లను యెంతమాత్రమువెనువెంట నెల్లకడలఁబారినవిధమయ్యె. నీచబుద్ధిచేవీఁడు నన్నుఁజంపనెంచెడు. వీనికి పాపభయం బిసుమంతయులేదుకాఁబోలు. ఇట్టినీచుని చెంతనుంచరాదు.

(ప్రవేశము—చంద్రసేనుఁడు-వృద్ధసేవకుఁడు.)

అజితసింహా! నేడేల దీర్ఘముగ విచారించుచుంటివి. నీచత నీయన్న చేయుచుండు క్రూరకార్యములు నీకువిదితంబులయ్యెనా.

తే॥ గీ॥ ఆటలాడించితినినిన్ను అజితసింహ
నిన్నువిడనాడియుచట నే నిలువఁజాల
నన్నుఁగొనిపొమ్ము నీతోడ సన్నుతాంగ
లేకపోయిన నేనుండ లేనుసుమ్ము॥

అజితసింహుడు:- చంద్రసేనా! నేటిరాత్రియే నేనీగృహమును వదలిపోవనుంటిని. ప్రయాణమునకు సిద్ధముగనుండుము. వెడలిపోవుదము.

తృతీయాఙ్కము—ద్వితీయరంగము.

(ప్రవేశము—పద్మావతి-కమల.)

కమల:- సోదరీ! నీవేల యీావిధమునఁ జింతించుచు దినదినమునకు శుష్కించుచుంటివి. వేడినిట్టూర్పుల నెడతెగక విడచుచుందువు.

తృ తీ యా జ్కా ము.

తోటకవృత్తము। సోదరియీగతిశోకముతో డన్
క్రోధముఁ జూపెదుకోమలి యేలా
పాదములం బెదపావనభక్తిన్
నీదయఁజూపుము నెమ్మినినాపై।

సీ। నిండుచందురుఁబోలు నీముద్దుమోమిట్లు
వాడియుండఁగనేల వనజనేత్రి
గండుతుమ్మెదఁబోలు కలికినీకురులిట్లు
మాసియుండగనేల మంజువాణి
చొక్కంపుబంగారు సోయగంబులమేను
చిక్కియుండఁగనేల చిన్నెలాఁడి
కష్టంబులన్నిక్క కాయంబుడయ్యంగ
కారణంబేమొక్కొ కంబుకంఠి

తే। గీ। అమ్మయీగతినీవేల అలసితొక్కొ
మన్మథానలదందహ్యమానవగుచు
నజితుఁదలఁచుచునుంటివే యబలనీవు
నీదుకోరికెసిద్ధించు నిక్కముగను।

అజితుఁడాగర్భదరిద్రుఁడు. వానిసోదరుఁడు వానిని యిం టినుండి వెడలనడచెను. కేవలము వాని రూపపౌరుషములఁ గాంచి వానినివరించి యిటుల గుందఁజనునే.నీవన్నన్నో కాకో మరితవు. నీకటాక్షవీక్షణములకుగా నెందఱెందరు సుందర

రాకొమరులు నిరీక్షించుచుండిరి. అట్టివారినందఱనువదలి యి
టులేలగుందెదవు.

పద్మావతి:- పడతీ! నామనసార నేనజితునిగోరివరించితిని. అతఁడప్పు యితరుల నేవివాహమాడనొల్లను. త్రికరణశుద్ధిగాఁ బల్కుచుంటి? నన్నేల కష్టపెట్టెదవు?

ఉ॥ తాళఁగఁజాలనేను గనతధ్యమిదంతయు సన్నుతాంగియే
వేళనువానిఁజూచితినొ వేమఱునాదగు మానసంబునన్,
బాళియుఁగల్గెనమ్మవిను పల్కులు మోహముచేతఁగుందెదన్
గూళమనోభవుండు ననుకూలుఁడు గాకిటునేచసాగెడిన్॥
యింతయేగాదు.

తే। గీ॥ మన్మథాకారుఁడాతండు మగువ నేను
కోరితిని నాదుమనమున కోమలాంగు
అతనివిడిచియు నిలనునేనన్యుఁగోర
సత్యమిామాట నమ్ముమా సారసాక్షి॥

నేనతనిజూచినప్పటినుండియు నామనం బతనియందు లీనమైనది. క్రూరుఁడగు మదనుఁడు కుటలుఁడై నన్నేచుచుండెను. అజితుఁడు నిన్నటిదినముననే యిల్లువిడిచిచనియె. అప్పటి నుండియు నామన మాందోళనమొందుచున్నది. అతఁడడవుల యందుఁ గష్టములనుభవించుచుండ నేనిట సౌఖ్యములనందుచు నుండఁగలనా! నేనును యీారాత్రి రహస్యముగ పట్టణము నువదలిపోవ నెంచియుంటిని.

# తృతీయాఙ్కము.

కమల:- సోదరీ! నిన్నువిడిచి నేనిటనుండఁగలనా! నేనును నీవెనువెంటనే వచ్చుదానను.

పద్మావతి:- అటులనే కానిమ్ము. మనమీరాత్రియే పురమును విడిచిచనుదము.

## తృతీయాఙ్కము—తృతీయరంగము.

## హారావళీపర్వతారణ్యము-ప్రవేశము- తేజసింగు.

తేజసింగు:- ఔరా! ప్రభాతకాలపు మందమారుత మెంతయింపుగా వీతెంచుచున్నది. వివిధవర్ణములతోఁటి యీలేఁబచ్చిక బయల్లు పట్టురత్నకంబళములఁబోలి నేత్రానందకరములై యున్నవిగదా! శుకపికశారికా రవంబులును, మయూరములనాట్యములును, బాలహరిణముల ముద్దులాటలు నేత్రానందకరములు. కొదమసింగముల భీకరారవంబులు వీరభటుల సింహనాదములఁబోలి నన్నిపుడు రణోత్సాహుఁ జేయుచున్నవి. ఇందలి కొండగుహాలే రత్నమయహర్మ్యములు. యివన్నియుఁ దిలకించిచూడ దుర్మార్గజన భూయిష్టంబగు యుదయపురమునకన్న యీఘోరారణ్యమే నాకెంతయు సంతసమును గొల్పుచున్నది. మానవులు తమవిధ్యుక్తధర్మములఁ దెలిసికొనఁజాలక ధనమోహపిశాచపీడితులై ఆత్మలాభపరాయణులై పాపమునకు జంకక పలుపాట్లఁబడుచుందురు. జగన్నాయకుండగు పరంధాముండీ ప్రపంచమునఁ దమ్మేటికి సృజించెనో య

ను నంశమునే మఱచిరి కొందఱోలు. రాజ్యాభిలాషియై నిజసోద రుఁజంపనెంచు దుండగీఁడొకండు. పరదారగమనాభిలాషులై పాపకార్యములఁజేయు పరమక్రూరస్వభావులు కొందఱు. ఇట్టి వారుండుటచేతనే యీప్రపంచమింతటి హీనస్థితియందుండుట. సర్వజనుల సమదృష్టిఁజూచు సజ్జనులు మందునకైనఁ గానబడరు. దయామయా! ఇట్టినీచులఁజూచుచు నీవెటు లూరకుంటివి రఘురామచంద్రా! నిన్నుఁదప్ప నేనన్యులనుతింపనొల్లను. నీపాదముల నామనసారనమ్మి నిన్నునేఁగొల్చువాఁడను. నాకష్టములఁబాపి నన్నునీదరిఁ జేర్చుము.

సీ॥ పరమపావననామ భక్తపోషకరామ
వేడుచుంటినినిన్ను వేగరమ్ము
దానవాంతకశౌరి దయతోడననుజూడ
వేడుచుంటినినిన్ను వేగరమ్ము
నీరదసమగాత్ర నిగమాంతవేద్యుండ
వేడుచుంటినినిన్ను వేగరమ్ము
కోటిభాస్కరతేజ కోదండరఘురామ
వేడుచుంటినినిన్ను వేగరమ్ము
తే॥ గీ॥ క్రూరుఁడగు నాదుతమ్ముఁడు కుటిలమతిని
నన్నుజంపగ నెంచంగ నడవికేను
వచ్చి యిడుమలఁబడుచుంటి వారిజాక్ష
కాచిరక్షించుమా నన్ను గరుణగల్గి॥

## తృతీయాఙ్కము.

తే। గీ॥ సాధుజనులను బోషింపసారెకీవు
పుట్టుచుందువుజగతిని పుణ్యపురుష
నీదుభక్తుండుగజరాజు నిన్నుదలఁప
వేగవేంచేసి రక్షించి వేడ్కఁగనవె॥

తే। గీ॥ కోరివేడుచునుంటిని కోమలాంగ
నన్నుఁబ్రోవఁగరావేల నాదుతండ్రి
భక్తుకోరికెదీర్చుట భారమయ్య
వరదనామంబుగోల్పోవ వలదుతండ్రి॥

ఆపద్బాంధవుఁడను బిరుదమును గోల్పోకుము. పరమ సుగుణ స్వరూపిణియగు నాసుత యేవిధముగనున్నదోగదా! ఆమెకెట్టిలోపములఁ గలిగించక కుమారసింహుఁడు పోషించునే. ఆసాధ్విని తలఁచినపుడంతయు నామనముమిగుల వెతఁజెందుచున్నది. దిక్కులేనివారికి దైవమేదిక్కు. సర్వవిధములఁ గాపాడఁగలండను నమ్మకముగలుగుటఁజేసి నిశ్చింతముగ నున్నవాఁడను. లక్ష్మణసింహా! భోజనసమయంబయ్యె వెడలుదము రమ్ము.

నిష్క్రమింతురు.

అరణ్యములోప్రవేశము—అజితసింహుఁడు

చంద్రసేనుఁడు—వృద్ధసేవకుఁడు.

చంద్రసేనుఁడు:- రామ. రామ. రాత్రినుండియు యెడతెగక ప్రయాణమొనర్చి యింతవఱకరుదెంచితిమి. బాలుఁడగుటచే

యజితసింహుఁ డలసినట్లగుపడడు. నాకు నోరెండిపోవుచున్న
ది. నడువ శక్తియొకింతయేనిలేదు, కట్టా! తుదకీ ఘోరాటవిని
మృతిఁజెందుమని దేవుఁడు నానుదుట మూఁడుపంక్తుల వ్రాసి
యుండెఁగాబోలు. అజితసింహా! నోరెండిపోయెడు. మిక్కుట
ముగ దాహమయ్యెడు. వీరవరా! నీకుశుభమయ్యెడు. నీవింక
నన్నువదలిచనుము. ఇయ్యదియే నాశ్మశానవాటికయయ్యెడు.

(అని కాళ్లుచాచుకొని పరుండును)

అజితసింహుఁడు:- చంద్రసేనా! శ్రమవాయ నిట కొంత
విశ్రమింపుము. నేనుపోయి నీకుకొంత యాహారమునుఁ గొని
తెచ్చెదను.

(సమీపమున వటవృక్షముక్రింద తేజసింగు మిత్రులతో
భోజనమొనర్చుచుండును) ప్రవేశము-అజితసింహుఁడు

కత్తినిచేతఁబూని. వీరులారా! భోజనమొనర్పఁబోకుఁడు.
అతిక్రమించితిరేని నాకత్తి నిక్కముగ మీరక్తమును పానమొ
నర్చును. నేనెంత క్షుద్బాధితుఁడనై యుంటిని.

తేజసింగు:- తే॥గీ॥ బాలకాయీగతినినీవు పలుకనేల

ఆకలికినోర్వఁజాలక యలసినట్లు

కానబడుచుండె నినుఁజూడ కదనమేల

వలయునాహారమునునీవు వలసినంత

సంతసంబునభుజియించి చింతమాను॥

వీరవరా! నీముఖమునుగాంచినంతనే ఆకలికినోర్వజాల

క యలసినట్లుగుపడిని. వలయునంత భుజింపుము. శాంతివహిం పుము.

అజితసింహుఁడు:-ఆర్యా! మీ రెవరైనదియు నే నెఱుంగ ను. మీ మృదులవాక్సుధారసమును సేవించి నే నెంతయు ధ న్యుండనైతి. నేఁ జేసిన తప్పులకై యెంతయుఁ బశ్చాత్తాప మును జెందుచుంటిని. ఆర్యచంద్రమా! మిమ్ముఁగన్నంతనే మీ రొకప్పుడు మిగుల నున్నతదశయందుండినటులఁ దోఁచె డిని చిన్నతనమునుండియు మిక్కుటముగనన్నుఁ బ్రేమించి ప్రి యాసములమదినెంచక నావెనువెంటఁజనుదెంచి యాఁకలిద ప్పులకోర్వఁజాలక యీయడవియందనతిదూరమున నా సేవకుం డొకఁడు సొమ్మసిలి పడియుండె. వానికాహారమిడి తృప్తినొం దించుదనుక నేనిచ్చటనుండఁజాలను.

తేజసింగు:- యువకుఁడా! శీఘ్రగతిఁబోయి నీసేవకునితో నరుదేరుము. నీకొఱకు వేచియుందుము.

(అజితసింహుఁడు నిష్క్రమించి చంద్రసేనునితోఁ బ్రవే శించును.) అందఱు భోజనమొనర్తురు. చంద్రసేనుఁడు పూర్వ శక్తినిఁగాంచును.

తేజసింగు:- సుందరరూపా! నీపట్టణంబెయ్యది? నిన్నుఁగ న్నతలిదండ్రులెవ్వరు? నీపావననామాక్షరములెవ్వి? నీకీగతి కాంతారవాసంబు కలుగనేల?

అజితసింహుఁడు:- ఆర్యా! నేనుదయపుర నివాసుఁడ. నా తండ్రి సుగుణమూర్తియగు తేజసింగున కంతరంగమిత్రుఁడగు మదనసింహుఁడు. నన్నుజను లజితసింహుఁడందురు. నాసోదరుఁ డసూయాపరుఁడుగా నేనాతనివదలివచ్చితిని.

తేజసింగు:- నిక్కముగనీవు మదనసింహునికొమరుండవే. లేకున్న నీసుగుణములు నీకెట్లలవడియుండును? నిన్నుఁజూచి నంతనే గతించిన నామిత్రునిఁ జూచినటులున్నది. నీవిచ్చటనే సంతసముననుండుము.

అజితసింహుఁడు:- (స్వగతము) ఏమీ! వీరు మహారాజు గారగు తేజసింగుగారా! నాభాగ్యమున కేమనవలయు. నాజన్మము సార్థకమొందె నేనీవీరపుంగవుని సేవించుభాగ్యముగల్గె (ప్రకాశము) రాజచంద్రమా! మీరుండెడుప్రదేశము నాకు స్వర్గతుల్యము. ఆమరణము మిమ్ము సేవించుచుఁ గాలమును గడుపువాఁడ.

(చతుర్థాఙ్కము—ప్రథమరంగము.)

హారావళీపర్వతారణ్యము. ప్రవేశము. పద్మావతి (పురుష వేషమున (చంద్రుఁడు) కమలమారువేషమున (కమలిని)

కమలిని:- సోదరీ! నీవుపురుషవేషముననుండుట మనకెంతయు ననుకూలము. లేకున్న దుర్మతులెందరో మనలనడ్డగించి కడుజులకనగాఁజూచుచు హాస్యమొనర్తురు. పట్టణమునువదలి

సుఖముగా నీయరణ్యమును జేరితిమి. రాత్రియంతయుఁ బ్రయాణమొనర్చుటఁజేసి నేనెంతయు నలసియుంటి? అల్లదే యచ్చటనొకఁడు గొఱ్ఱెలనుమేపుచుండెను. వానిఁజేరి మనల సత్కరింపనడుగుదము. వానిగృహము సమీపమునందుండిన టులఁదోఁచెడి? వాఁడుతప్పక మనలసత్కరించును అచ్చటికిఁ బోవుదమురమ్ము.

చంద్రుఁడు:- కోమలాతికోమలంబులగు నీమృదుపాదములు రక్తముసుజిందుచు నన్నెంతయుఁ జింతిలఁజేయుచుండె. హా కరీ! యానిర్భాగ్యురాలినన్ను ప్రేమను దృజింపఁజాలక యింతదూరమే తెంచి పడరానిబన్నములఁ బడుచుంటివి. పోవుదమురమ్ము. మనలను బోయఁడు తప్పక సత్కరించును. (అని గొఱ్ఱెలకాపరిని సమీపింతురు.)

చంద్రుఁడు:-క్షుత్పిపాసలచే జచ్చుచుండు మమ్ము సత్కరించి శాశ్వతకీర్తిఁబడయుము. తుదకింత క్షీరములనైన నొసంగి యీ నాచెలియలిని రక్షింపుము. నీమేలును మేము మఱచువారముకాము.

బోయఁడు:- అయ్యా! మిమ్ములఁగాంచినంతనే నాకమందానందమొదవెను. మీరుగొప్పవారుగా గానఁబడెదరు. ఆర్యచంద్రమా! యిప్పుడే యీపాత్రలోనికిగొన్ని పాలనుబితికియుంటిని. కడుపారఁద్రాగుఁడు. సమీపముననే మాయజమానుని యిల్లుగలదు. మీరచ్చటికరిగినచో వారు మిమ్ము తప్ప

కసత్కరింతురు. కారణాంతరములచే వారు తమసర్వమును వి క్రయింపనుండిరి. మీరద్దానిఁ గొనినచో నేను మిమ్ముఁగొల్చుచుండెదను. అతని నివాసమునకిదియే త్రోవ (చంద్రుఁడుకమలిని నిష్క్రమింతురు.) కొంతదూరమున నొకచిన్నగృహమగుపించును.

చంద్రుఁడు:- ఇయ్యదియే యాబోయ చెప్పిన యజమానియిల్లు. వీనిని సందర్శించి మాటాడుదమురమ్ము. (అనిగృహము సమీపింతురు.)

అరవిందుఁడు:- అయ్యా! సుస్వాగతము. ఇటులరు దెంచి యీయాసనములఁగై కొనుఁడు. అయ్యా! తమ దే పట్టణము? తామిటకరుదెంచుటఁ జేసి నాగృహము పావనంబయ్యె. కారణాంతరములచే నీగృహముతో నాసర్వస్వమును విక్రయింపనుంటిని. తమకిష్టమేని సరసముగ నొసంగెదను.

చంద్రుఁడు:- అరవిందా! ప్రకృతము నాయొద్దధనములేదు. ఇదేకనుఁగొనుము. ఈసొమ్ముల నొసంగెదను. నాకువిక్రయింపుము.

అరవిందుఁడు:- ఆర్యా! సొమ్ములు మాత్రము ధనము కాఁజాలదా! అటులనే కానిమ్ము. రేపుదయమే సర్వమును మీకు వదలి వెళ్లెదను.

(చతుర్థాజ్కము—ద్వితీయరంగము)

అజితసింహుఁడు:- నేను పట్టణమును వదలి యిటకరుదెం

చి రెండుమాసములయ్యె. మన్మనోహారిణియగు పద్మావతి యేవిధముగ నున్నదోగదా. ఆతరుణీలలామను దలంచినపు డంతయు నామనము మిగుల వెతఁజెందుచుండును.

తే॥ గీ॥ నాడుసభలోన హరిసింగునాడు శక్తి
చేతడీల్పడ జేయంగఁ జేడెనన్ను
మనమునందునఁ గోరియు మమతనాడు
మెడనుహారంబువేయదే మెచ్చులాడి॥

ఆకుసుమకోమలాంగి యిపుడెచ్చటనున్నదో తెలియఁబడదు.

ఉ॥ మానిని! నిన్నుఁగోరియిటు మానసమందునఁ జాలగుందుచుం
గానఁగఁజాల కేను కడుగష్టములెన్నియొ చెందుచుంటినీ
కాననసీమలోననినుఁ గన్గొననెంతో శ్రమంబుగొంటి నీ
కానఁగనైనా లేదాయిఁక నాగతియెట్టులు కాగనున్నదో॥

పట్టణమునువీడిచనినదని నేవినియుంటినిగాని యెందు వెదకిన నాపద్మావతిజాడలింతవఱకుఁ గానఁబడలేదు.

తే॥ గీ॥ సుమశరునిరాణి కెనయైనసుందరాంగి
భామ నీగతిఁబాసినే బ్రతుకగలనె
క్రూరబుద్ధిని మదనుండు మేరమీరి
వాడిబాణంబులనుచాల వదలసాగె॥

మన్మథుఁడన్ననో వాడిశిలీముఖములఁబఱపి నాకాయమును గాయముచేయుచుండె.

# పద్మావతి.

## (ప్రవేశము—చంద్రుఁడు)

రూపజితమారుఁడగు అజితసింహుని నామనసారఁ బ్రేమించి మిగులవెతచెందుచుంటిని. ఆతఁడీయరణ్యప్రదేశమునకరుదెంచెనని వింటనేగాని యెందునను అతనిజాడలు కానరావు.

తే। గీ। సూనశరుఁబోలు సుందరుఁజూడ కేను
తాపమెట్లోర్చుదాన నీధరణిలోన
దినముయుగముగదోఁచెడు దేవదేవ
కాలమేగతివేగింతు కమలనయన।

సీ। ప్రాణేశనీమంజు భాషలువినలేని
కర్ణరంధ్రంబుల కలిమియేల
పురుషరత్నమనీవు భోగింపఁగాలేని
తనులతవలని సౌందర్యమేల
భువనమోహననిన్నుఁ బొడగానఁగాలేని
చక్షురింద్రియముల సత్త్వమేల
దయితనీయధరామృతం బానఁగాలేని
జిహ్వకు ఫలరససిద్ధియేల

ఆ। వె। నీరజాతనయన నీవనమాలికా
గంధమబ్బలేని ఘ్రాణమేల
ధన్యచరితనీకు దాస్యంబుజేయని

# చ తు ర్థా ఙ్క ము

జన్మమేల యెన్నిజన్మములకు॥

[భాగవతము.]

ఆనవమోహనాంగునిఁగూడి సుఖింపఁజాలని యీబ్రతుకెందులకు. తుంటవిలుకాని దుండగములుమెండయ్యె. భరింపఁజాలకుంటి? ఔరా! మదనా! నీకిదితగునా!

క॥ మారా! యనదలపైచల
మేరా! శంకరునిచేత మృతిజెందకపో
తేరా! దురితవిచారా
నీరా యిడితెగదలంప నేరనుగదరా॥

కోకిలా! నీకేకరింతలెందుకు. ఎప్పుడయిన నాకష్టము నీకీగతి తప్పకకల్గును. విరహార్తులఁగన్నచో నీవు మిడిసిపడుచుందువు.(అని అచ్చోఁబడియున్నయొకయాకును తీసికొని) ఏమిది. యిందేమియో లిఖింపఁబడియున్నది. ఏమున్నదో చదివెదఁగాక.

తే। గీ॥ మరునిరాచిల్క నిక్కంపుమంజువాణి
పద్మయనుపేరుగలకాంత పరమసాధ్వి
సుదతియెచ్చటనున్నదో చూడకేను
నిమిషమోర్వంగఁజాలను నిక్కమరయ॥

పద్మయని సంబోధించియుండుటఁజేసి యితఁడు నాయుజితుఁడైయుండునా! కనుఁగొనినబాగుండును.(అనిదృష్టినిగుడించి) అల్లదె యెవ్వఁడోయొకఁ డావైపుననుండి వచ్చు

చుండె. వాఁడెవ్వఁడయినదియుఁ దెలిసికొనియెద్దఁగాక.

(విరహార్తుఁడగు అజితుఁడుసమీపించును.)

చంద్రుఁడు:-(స్వగతము) వెతుకఁబోయిన తీగె కాళ్లకుఁదగి లెనన్నట్లు లీయజితసింహుఁ డిటకరుదెంచె. నేమెడయందిడి న హారములేకున్నచో నూహింపఁ గష్టముగ నుండెనుగదా! ఇతడెంత చిక్కియున్నవాఁడు. (ప్రకాశము) ఆర్యా! తమ దేపట్టణము? ఈవీఘోరారణ్యముల సంచరించనేల?

అజితసింహుఁడు:- యువకుఁడా నిన్నుఁగన్నప్పటినుండియు నామనమేలకో మిగులసంతసమొందుచున్నది. కారణాంతర మున నేను మాపట్టణమునువదలి యవ్విపినమునఁ దిరుగుచుంటి ని. వీరవరులు సంచరింపరాని స్థలమెందైననున్నదా!

చంద్రుడు:- మీముఖముఁ జూచిన మీరెంతేయునలసియు న్నట్లున్నారు. సమీపముననే మాకుటీరమున్నది. ఆర్యచంద్ర మా! మీరటకరుదెంచి నేనొసంగు నాతిథ్యముఁ గైకొని న న్ను సంతసింపఁ జేయుఁడు.

అజితసింహుఁడు:- నీస్నేహౌదార్యముల కెంతయు సంతసిం చితి నీకతిథినగుట నాకెంతయు సంతోషము.

(చంద్రునికుటీరము. ప్రవేశము చంద్రుఁడు అజితసింహుఁడు)

చంద్రుఁడు:-మిత్రమా! యీయాసనముఁ గైకొనుము. నే నిచ్చెడు నాతిథ్యమునుఁ గైకొని నన్ను సంతసింపఁ జేయుము.

నీముఖము వాడియున్నది. నిన్నుఁజూడ నొకకాంతను వరించి మనమున గుందుచున్నట్లు తోఁచెడిని. అటులయినచో నాకెఱిగింపుము. నేతోడ్పడెదను.

అజితసింహుఁడు:- సుహృదయా పద్మావతియను నొక కన్యను నేమనసారఁ గోరి వరించితిని. ఆతరుణీలలామ కొన్నిదినముల నుండి కనఁబడుట లేదు.

చంద్రుఁడు:- నీవామెను ప్రేమించినటుల నిన్నామె ప్రేమించుచుండెనా. ఇంతటి సుందరాంగుని వదలి యామె యెచ్చటి కరిగెను.

అజితసింహుఁడు:- ఆసుందరాంగి నన్ను గాఢముగఁ బ్రేమించెననుటకీ ముత్తియముల హారమే సాక్షి.

తే॥ గీ॥ నన్ను మదినిండఁ బ్రేమించెననుటకిదిగొ
ముత్తియంబుల హారంబు ముగుద నాదు
మెడను వైచెను సభలోన మెచ్చినన్ను
నిప్పుడెచ్చటనున్నదో యిందువదన॥

చంద్రుఁడు:- వ్యసనమును మానుము ఆమెను తప్పకశీఘ్రకాలముననె కనుగొనఁగలవు. అంతవఱకు నాయొకస్నేహభావము వహించి యిటకరుదెంచుచుండుము.

అజితసింహుఁడు:- అటులనే కానిమ్ము.

నిష్క్రమించును

(చతుర్థాఙ్కము. తృతీయరంగము)

ప్రవేశము:- జయసింహుఁడు. హారావళీ పర్వతారణ్యము.

అజితుఁడు బ్రతికియున్నంతకాలము నామనమునకు శాంతి కలుగదు. వానినిరహస్యముగ దుదముట్టింపనెంచితిని గాని వాఁడాసంగతి నెటులనో తెలిసికొని పట్టణమును వదలి చనియె. వాఁడీయరణ్యము నందుండునట్లు నేవినియుంటిని. వానినిజప్పక తుదముట్టింపవలయును. పయాణశ్రమవాయ నొకింత విశ్రమించి తర్వాత యరసెదఁగాక. (అనివిశ్రమించును. అందుండిన యొక పామువాని మెడనుచుట్టుకొనును. సమీపమున యొకసింహముపొంచియుండును.)

(ప్రవేశము) అజితసింహుఁడు:- యువకుఁడగు నాకొల్లఁడు నన్ను బ్రేమతోనరయుచు మిగుల సన్మానించుచుండును. వానియందుఁ బద్మావతి రూపములగుపడెడిని (అజితునిఁజూచి జయసింహుని మెడలోనిపాము వెళ్లిపోవును.) ఓరా! వీఁడెవ్వడో మార్గాయాసమున మిగులనలసి నిదురించుచుండెను. ఈ పాము వీనిసజంపనుండి నన్నుఁగన్నంతనే పారిపోయెను. క్రూరుఁడగు జయసింహుఁడుగదా వీడు. వీఁడెందులకిటవచ్చి యున్నవాఁడు. వీనినిగాంచినంతనే నాదేహము మండుచున్నది. అల్లదే యచ్చోనొకసింహము వీనినిజంపుటకు వేచియున్నది. దానినిబరిమార్చెదఁగాక. (అని సింహముపై కురికి దానినిఁజంపును చేతికిదెబ్బతగిలి మూర్ఛితుఁడగును.) జయసింహుఁడు మే

ట్కాంచి, ఓహో! యజితుని యౌదార్యము. వాడిటకరుదెంచి ద్రోహినగు నన్నురక్షింప నీసింహమునుఁ జంపి మూర్ఛిలి యుండె. వీడెంతటి సజ్జనుండు. సహజవిరోధినగు నన్నుజంప నుండిన యీసింహమునుఁబరిమార్చి శాశ్వతకీర్తిఁగాంచె. ఇట్టి సోదరునియెడనాకీ యీర్ష్య యెందులకుఁగలిగె. ఇందుకునే నెం తయుఁ బశ్చాత్తాపతప్తుండనైతిని. సోదరా! యీనీచునితప్పుల మన్నించి నన్ను బూర్వవిధమునఁ బ్రేమింపుము.

అజితుఁడు:- అగ్రజా! నేకడుబడలియుంటిని. ఇచ్చటికనతి దూరమునయుండు నొకకుటీరమునందు నామిత్రుఁడొకడున్నాఁ డు. నాకొఱకతఁడువేచియుండును. నీవచ్చటికేగి యీవిషయ ము నెఱింగించి నేను రేపురానుంటినని తెల్పిరమ్ము.

జయసింహుఁడు:-సోదరా! అటులనేకానిమ్ము.

(చంద్రుఁడు-కమలిని.)

చంద్రుఁడు:- నేఁడేటికో యజితుడింతవఱకును రాఁడయ్యె. వానికెట్టియాపదలును రావుగదా!

(ప్రవేశము) జయసింహుఁడు:- అయ్యా! అజితసింహుఁడు సింహముతోఁబోరాడి యలసియుండి రేపరుదెంతునని మీకు విన్నవింపుమనియె.

చంద్రుఁడు:- ఏమి! వానికిదెబ్బలేమియులేవుగదా? నీవె వ్వఁడవు?

జయసింహుఁడు:- అయ్యా! నాసోదరునకిసుమంతయు

బాధలేదు. నేనజితునిసోదరుఁడ క్రూరుఁడనై పాపమనక యిం టినుండివాని నడవులకుఁ బంపితి. ఇప్పుడెంతయు వ్యసన మొందుచుంటిని. నాపేరుజయసింహుఁడందురు.

కమలిని:- (తనలో) నేనితనిఁగాంచినప్పటినుండియు నామ నంబితనియందు లీనమైనది.

జయసింహుఁడు:-

ఉ॥ చారుతరాంగియీలలన చక్కనిముద్దులగుమ్మ చూడనా
మారునిభార్యకన్న; కడుమాసినచీరెనుగట్టియుండినన్
మీరుచునుండెఁజూడగను;మిక్కుటమయ్యెడఁ బ్రేమగల్గెనా
కూరటగల్గదయ్యెనను గూరిమిఁజూచునో లేదొమాధవా॥

ఈసుందరియెవ్వరు. ఈపెనుగన్నప్పటినుండియు నీమె మెడ ననురాగంబూనియున్నది. ఎట్లులయినను యీసుందరిని వివాహమాడవలయును.(ప్రకాశము) మిత్రమా! నేవెళ్లెదను.

నిష్క్రమించును.

(పంచమాఙ్కము—ప్రథమరంగము.)

ప్రవేశము-జయసింహుఁడు-అజితసింహుఁడు.

సోదరా! నన్నాసుదతి తప్పక వివాహమాడుననునమ్మకము నాకుఁగలదు. నేనాగొల్లపిల్లను వివాహంబాడి యిచ్చుట నేనివసింతును.

అజితసింహుఁడు:- సోదరా! నీవాసుదతిని బెండ్లాడనెంచు

చో నీవామెయను మతిఁగైకొనిరమ్ము. అ బాలయిపుడొంటి గా నింటియొద్దనున్నది అల్లదే చంద్రుఁడిట వచ్చుచున్నాఁడు. కాన నీవరిగి యామెయనుమతిఁ గైకొనివచ్చినచో రేపే వీరా వివాహము నెఱవేర్పఁబడును.

(జయసింహుఁడు-నిష్క్రమించును.)

(ప్రవేశము) చంద్రుఁడు:- మిత్రమా! అజితసింహా! నిన్న నీసోదరునివలన నీవొకసింహముతోఁ బోరాడి గాయపడియుంటి వనివిని నేనెంతయుఁ జింతిలితిని.

అజితసింహుఁడు:- మిత్రమా! నీప్రేమ నిను జింతిలఁజేసి నది. నాగాయమంతబలమైనది కాదు. చంద్రా! నాసోదరుఁడ గు జయసింహుఁడు నీసోదరిని నిన్నజూచినదిమొదలు మనసా ప్రేమించెడివాఁడు. నేను నాసోదరునితో నీవాసుందరి యను మతివడసిన తప్పక వివాహంబొనర్తునని చెప్పియుంటిని. అతఁ డిపుడు నీసోదరిని జూడనేగియుండె.

చంద్రుఁడు:- ఆమెసమ్మతించుచో నీదాంపత్యము నా కెంతయుఁబరమసమ్మతము. మిత్రమా! నీమనసారనీవు పద్మా వతిని ప్రేమించుట నిక్కమా? నిజమగుచో నీకోఱికెనెఱవే రిన నెంతసంతసముగలుగును.

అజితసింహుఁడు:- మిత్రమా! యదికలలోనివార్త. నేనె క్కడ. పద్మావతియెక్కడ. అట్టిసాధ్వినాకులభించునా. (అని

నిట్టూర్పువిడుచును.)

చంద్రుఁడు:-నిరుత్సాహుఁడవు కాకుము. నీపద్మావతి నిక్కముగనీకుఁ జేకూరును. మిత్రమా! నాకొక మాయయుండెడివాఁడు. చిన్నతనమున నతఁడు నాకు సమ్మోహనశాస్త్రము నేర్పియుండె. నామంత్రప్రభావమునఁ బద్మావతినిటకు నేరప్పించఁగలను.

అజితసింహుఁడు:- మిత్రమా! నిక్కువమా! నేనేమనివినుచుంటిని. నాపద్మావతినీ నాకుఁజూపెదనంచు పలుకుచుంటివి. అదిసాధ్యమే?

చంద్రుఁడు:- నిక్కముపచించుచుంటిని. నీవుపద్మావతిని నిక్కముగ వివాహముగానెంచుచో రేపు రాజుగారితో సిద్ధముగనుండుము.

అజితసింహుఁడు:- మిత్రమా! యెంతయుసంతసము.

---

(పంచమాఙ్కము-ద్వితీయరంగము.)

ప్రవేశము-కుమారసింహుఁడు మిత్రులతో.

తే॥ గీ॥ నాదుప్రేమంపుసుతగూడ నన్నువిడిచెఁ
బోవుచుండిరిజనులెల్ల బూర్వమైత్రి
తేజుచెంతకునెంతయు తెగువచేసి
కనిన శోకంబునాకెంతో గల్గుచుండె.

తే॥ గీ॥ జ్ఞానవానినిబట్టినే కట్టికొట్టి
రాకయుండిన నాదగురాజ్యమెల్ల
శూన్యమగుఁగాక నిలువరు శూరులిందుఁ
జంచిచెండాడకీగతి చింతయేల॥

మిత్రులారా! తేజుఁడడవియందున్నను బ్రజలెల్ల రొక్కొకరుగా వానిఁజేరుచుండిరి. ఇట్లుపేక్షించి యూరకున్నచో మనరాజ్యము కొన్నిదినములలోనె శూన్యంబై యరణ్యమే పట్టణము కాఁగలదు. కాన నెట్టులయినను తేజుని మట్టుబెట్టఁ జనును.

రాజసింహుఁడు మదనసింహుఁడు:- రాజచంద్రమా! అటులనే కానిమ్ము.

(ప్రవేశము-వృద్ధసన్యాసి.)

కుమారసింహుఁడు:- తాపసోత్తమా! కుమారసింహుఁడు నమస్కరించుచున్నాఁడు.

సన్యాసి:- ఆయుష్మంతుఁడా! శాశ్వతకీర్తిఁబడయుము. ఈసమరసన్నాహం బెచ్చటికి. అసూయయెప్పుడును దరిజేర్పరాని ది అత్యుత్కృష్టంబగు నీమానవజన్మమును దేవుఁడు మనకొసంగినదెందులకో మనమూహించి సత్పథమునజరించుట మోక్షప్రదము. ఈషణాత్రయమునకులోనై దార్మార్గమున సంచరించుట పాపహేతువు. కుమారసింహా! తేజుఁడు నీకగ్ర

జాఁడు. నీచేఁబూజింపఁబడవలసినవాఁడు. అతనికి క్రీడానర్ప నేం చుట పాపహేతువు.

కుమారసింహుఁడు:- (తలవంచుకొని) తాపసో త్తమా! నీ వాక్యములు నాకుపదేశములై నాగుణములనుమార్చెను. పితృ సమానుండగు నాసోదరునిఁ జేరి రాజ్యమునప్పగించి యతని నే సేవించుచుందును.

(తేజసింగు మిత్రులతోఁ గనుపించును.)

కుమారసింహుఁడు:- అగ్రజా! నీసోదరుండిదే నమస్క రించుచున్నాఁడు. నాతప్పులమన్నించి నీరాజ్యముఁ గైకొని పాలించుము.

తేజసింగు:- తమ్ముఁడా! యెంతేయు సంతసమొందితిని.

(పంచమాంకము-తృతీయరంగము)

ప్రవేశము-అజితసింహుఁడు:- నన్ను రాజగు తేజసింగుతో సర్వసిద్ధముగరమ్మని నామిత్రుఁడగు చంద్రుఁడు చెప్పెను. నేను పద్మావతి నన్ను వివాహమాడును. చంద్రునిమాటల విశ్వసిం పవచ్చునా. పద్మావతి యీాయడవియందు నిక్కముగనున్నదా. అదేలకో నామనమున కూరటగలుగుట లేదు. (ప్రకాశము) రాజచంద్రమా! నేఁడుమావివాహములుజరుగును. మీారుమా వెంటనుండవలయును.

తేజసింగు:-వీఁడుమోహించిన యాసుదతి నాకూర్మిసుత

యగు పద్మావతియేయయియుండునా! చంద్రుఁడన్నట్లు ప
ద్మావతిని జూపఁగలఁడా! నాసుత యవ్వీరునివరించుట నాకుఁ
బరమసమ్మతము.

(ప్రవేశము-చంద్రుఁడు-కమలిని.)

తేజసింగు:- ఈచంద్రునిముఖ మన్నివిధముల నాసుతము
ఖమునుఁ బోలియున్నది. ఈచంద్రుఁడే నాసుతయగు పద్మావ
తి కాదుగదా.

కుమారసింహుఁడు:- ఈలేమను గాంచినప్పటినుండియు
నాసుతయగు కమలనుఁ గాంచినట్లున్నది.

చంద్రుఁడు:- రాజచంద్రమా! నీసుతయగు పద్మావతీ
యీవీరవరుఁడగు నజితసింహుని వరించుట నీకిష్టమేనా?

తేజసింగు:- నాకుఁ బరమసమ్మతము.

చంద్రుఁడు:- కుమారసింహా! నీసుతయగు కమల యీాజ
యసింహునివరించుట నీకుసమ్మతమేనా?

కుమారసింహుఁడు:- నేవలదనను.

చంద్రుఁడు-కమలిని- నిజరూపములతోఁ బ్రవేశింతురు.

(వివాహములుజరుగును.)

మంగళము. మంగళాత్మపతంగ తేజ విహంగవాహను
భాంగా। అంగజోపమరూపమునిసురపుంగవార్యసుసన్నుతా॥
మం॥ దిక్కుమాలినబక్కబాపని పక్కజేర్చుక నమ్మికే।

పద్మావతి

సొక్కఁ జేసియు బొక్కఁడటుకులు మెక్కటొక్కఁ సించిరట।
మం॥ ధాత్రినూత్నపురీసుధాముఁడ పాతుప్రేమను కరుణింపుమా
ధాత్రిజాసహితంబునీమృదు గాత్రమికదయఁ జూపుమా॥మం॥

గద్య ఇది శ్రీ సీతారామచంద్ర చరణసేవా వరప్రసాదిత
కవితావిచిత్ర ముద్దుమంగర! గోత్రపవిత్ర
చింతా లింగారెడ్డి ప్రథమపుత్ర బుధజన
విధేయ వినయధురీణ నరసింహ
నామధేయ ప్రణీతంబైన
పద్మావతియనునాట
కము సర్వముపం
చ మాంకము
సమాప్తము.






శ్రీ జానకీ ముద్రాక్షరశాల, ప్రొద్దుటూరు. 1926.

# పండితాభిప్రాయములు.

మ॥రా॥శ్రీ కె. సి. నరసిహ్మారెడ్డిగారికి.

ఉ॥ భావముశ్లిష్టశాసనము పద్యచమత్కృతి సద్రసంబు మేల్
చేవపదంబు నర్థమును చిక్కనికల్పన సౌకుమార్యముల్
ప్రోవులుగాగ పూర్వ కవిపుంగవులన్ మఱపించిమించు ప
ద్మావతి నాటకంబున ముదంబుగదా నరసింహసత్కవీ!

గీ॥ ధీరత రచించు పద్మావతీచరిత్ర
సరసవాచావిలాస విశారదులకు
సంతసంబిచ్చి మీకుయశంబుదంబు
శిరుల జేకూర్చ దే నరసింహసుకవి.

గీ॥ ధరణి పద్మావతీచరిత్రాంబుదంబు
చెలగికవిసీములందు వర్షించివారి
ఫలవిభరితులఁ జేసి మెప్పందకున్నె
శ్రేష్టగుణకవి నరసింహరెడ్డిసుకవి!

సీ॥ శ్రీవిద శ్రీపద్మావతీచరిత్రంబొందు భావింపదగు సత్యవతియొకండు
సలపురుల్కాని పెండ్లి పగపులపుట్టి సుగుణమణి రెండుముక్కపదలిర్చు
పడకటిల్లు మొదలు పరిపక్వమైనట్టి నాటకరాజముల్ మేటికవులు
పండితమూర్తులు ప్రస్తుతించెడుభంగి చిరుతప్రాయమునరచించి
కోమలాంగికి మెప్పను గూర్చిజగతి [యాంధ్ర
పలువిధంబుల చింతాన్వయాయుఁడైన
దొడ్డగుణుఁడగు నరసింహరెడ్డిసుకవి
జన్మఫలముగ నిహపరసాధకముగ.

కనిగిరి [నెల్లూరు]
18—11—26

ఇట్లు,
ఓంకారము గురువరాజకవి,
అష్టావధాని.

# పండితాభిప్రాయములు.



మ॥ రా॥ శ్రీ. కె. సి. నరసింహారెడ్డిగారికి.

మీచే కల్పింపఁబడిన పద్మావతియను నాటకమును దిలకించితి. మోదమందితి. కథ హృద్యంగముగా నున్నదనుట యతిశయోక్తి కాదు. పురాతనకవులుగాని, యిప్పటి కవిపుంగవులుగాని శాంత, కరుణా, భక్తి, ధైర్య, గాంభీర్యరసముల విశేషించి కల్పించినారుగాని శృంగారరసమిట్టుల వర్ణించి వ్రాసినట్లగుపడలేదు. వీరభినవశ్రీనాథులనిచెప్ప సాహసించుటతిశయోక్తి కాదు. పండితపామరులెల్లరు వీరినగ్గించి వీరికి గ్రంథములువ్రాయు నభిరుచిపుట్టునట్లు ప్రోత్సహించవలెనని కోరుచున్నాను. ఇదియునుగాక రెడ్డికులసంజాతులలో కవితానైపుణ్యతగలిగినవారు తక్కువయని చెప్పకొనకుండా మనఆంధ్రదేశమునకు కీర్తికలిగించిన వారిలో వీరొకరని నాయుద్దేశ్యము. వీరిసుగుణపుంజములను వర్ణించుటకు గ్రంథవిస్తరభీతిచే విరమించుచున్నాను.

ఇట్లు,
బుధజనవిధేయుడు
ఎ. అంకిరెడ్డి.

# పండితాభిప్రాయములు

## శ్రీయుత చింతా నరసింహారెడ్డిగారికి.

మిత్రమా ప్రస్తుతమన్నివర్ణములవారిలో శతావధానులు ప్రబంధనాటక నవలాగ్రంథకర్తలు వ్యాసలేఖనాధురీణులు మహావక్తలువెడలి భాషాసేవజేయుటకు బూనుట దేశాభ్యుదయమునకు శుభసూచకము. మనపంచమసోదరులును సత్వరవాగ్వైభవదశనంది మనలో నన్నిటియందు సమానులగుటకు సదీయాశయము ప్రశస్తకవిపుంగవులగు ఉమ్రమెయాలీషాదిమహమ్మదీయ సోదరులు ఆంధ్రభాషాయోషామణి నలంకరించుచుండుట ప్రశంసనీయము. రెడ్డికులావతంసా! త్వదీయానర్ఘశేఘారకును కవిత్వసరణికిని భావకల్పనాశక్తిని సంతసించినాడ. సులభశైలితో కవిత్వము జనానుకూలముగానున్నది. సోదరా! కాలముపృథబుచ్చక దేశారాధనసంఘసంస్కరణ ప్రబోధనాది గ్రంథముల నింకనువ్రాసి శాశ్వతయశమందుట కభిలషించుచున్నాడ.

ఇట్లు,

శ్రీబాలవైద్యసుధాబ్ధి, ధన్వంతరివైద్యలహరి
ఆంధ్రమాత సంపూర్ణభాగవతనాటకాది గ్రంథకర్త
రాజవైద్య గ్రంధి వేంకటసుబ్బరాయగుప్త.
వంబూరు. [గుంటూరుజిల్లా]

# సీతాకల్యాణము.



## గ్రంథకర్త:—కవిసింహ. డి. రాజశేఖరశతావధాని.

బాలసరస్వతీ, కావ్యతీర్థ అభినవ వాల్మీక్యాది బహుళ బిరుదాంచితులగు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారీ నాటకమున కుపోద్ఘాతమును వ్రాసియున్నారు.

శ్రీరామజననము మొదలు సీతాకల్యాణమువఱకుఁ గలకథ యింగ రమ్యముగఁ బొందుపరుపఁబడి యున్నది. ప్రథమాంకమున విష్ణునితో దేవతలు మొఱపెట్టుకొనుటయు, ద్వితీయాంకమున దశరథ విశ్వామిత్ర సంవాదమును, తృతీయాంకమున విశ్వామిత్ర చరిత్రమును, చతుర్థాంకమున స్వయంవరమును, పంచమాంకమున దశరథరామ భార్గవరాముల సమావేశ సంవాదములును, మిక్కిలి రుచిమంతముగ నుండును. పరశురామ క్షత్రియరాముల సమావేశాదులు నూతనవిధానములతో నడుపఁబడి మిక్కిలి హృద్యంబుగను నానందకరముగ నుండును. శైలి శ్రేష్ఠము. వచనములును, పద్యములును రసపూర్ణములు. భావములు-హృదయంగమములు. రామాయణమును దెలియఁ గోరువారు దప్పక చదువఁదగినది. వెల. రు. 0—8—0.

# పద్మావతీవిజయము

## గ్రంథకర్త:—కవిసింహ. డి. రాజశేఖరశతావధాని.

ఇది మహోదాత్తగుణస్ఫురణముగలిగి వీరరసమహావతారమగు నొక కాంతామణిదివ్యచరిత్రము. పద్మావతీదేవి పురుషుల దుర్గుణములఁగుఱించి వివరించుతావులు కేవలము రససంఘటనములు. ఈమెబుద్ధి నిరుపమానము. పతిభక్తి సకలజనస్తవనీయము. పాతివ్రత్య మనన్యసాధారణము. ఔదార్య మ

---

జనోపకారిణిస్టోర్సు, ప్రొద్దుటూరు.

ప్రతిమానము. ఈనెనామము కుజనులకుచ్ఛాటనమంత్రరాజము. ఈసుదర్శనము దుర్మార్గులకు మృత్యుసందర్శనము. అర్థరాత్రమునఁ గొప్ప త్రియూరనవ్యగృహమున జగన్మోహనునంతవానిని దలదీసిన యుదాత్తనాయికారత్నము. సద్గుణరత్నములకు రత్నాకరము. ఇట్టినాటకరాజ మిదివర కాంధ్రభాషలోలేదు. శైలిమనోహరము. పద్యములు హృద్యములు. గద్యములుత్సాహరసపూరితములు. స్త్రీపురుషులందఱు తప్పకచదువఁదగినది.

వెల. రు 1—4—0

# విషప్రతివిషమంజరి.

———— o ————

అనుభవచికిత్సాదర్పణము నాడీనక్షత్రమాల మున్నగు గ్రంథములు రచించి జగత్ప్రసిద్ధిగాంచిన లోకరాజు వసంతపురం మునయ్యగారిచే రచియింపబడినది.

ఈగ్రంథము మితిమీరి భుజించిన పతివస్తువునకును విరుగులను తేటతెలుగు పద్యములుగా వ్రాయబడినవి. అన్నివిధములయిన గడ్డ దినుసులు, కూరగాయలు, పలువిధములయిన ఫలములు, అన్నిమాంసములు, విషపదార్థములు, తేలు, పాము, జెర్రి, మొదలగు విషజంతువులు, చీమలు, దోమలు. నల్లుల బాధలను దొలగించు పద్ధతులను వ్రాయబడినది. యివియవియన నేల ప్రపంచమున సామాన్యముగ దొరకు అన్నివస్తువులను పొరపాటునభుజించిన అన్నిటికిని విరుగులను కాపులేనిమామిడిచెట్లకు కాపునిచ్చు పద్ధతులను కూడను ఈగ్రంథమున వ్రాయబడినది.

ఇట్టిగ్రంథము తెలుగుభాషలో దొరకుటదుర్లభము. ఈగ్రంథము వైద్యులకేగాక అందరకును చాలముఖ్యము. వెల. రు 0-8-0 లు. మాత్రమే

ఈగ్రంథములు వలయువారు ఈక్రిందిచిరునామాకు వ్రాసినబడయగలరు.

---

జనోపకారిణీస్టోర్సు, ప్రొద్దుటూరు,

# అనుభవచికిత్సా దర్పణము.



రెండవముద్రణము! దళసరికాగితములు! చక్కని అచ్చు

గ్రంథకర్త:—వైద్యపండిత వసంతపురం

లోకరాజు మునయ్యగారు.

ఏబది సంవత్సరములుగ లోకమునందనేకస్థలముల యందు ఉపయోగింపఁబడి యనేకులనురక్షించిన బ్ర॥ వైద్య పండిత లోకరాజు వసంతపురము మునయ్యగారి, అనుభవము లోవాడి గుణమిచ్చిన ఔషధములను కొంచెమైనను మఱుగు పెట్టక బాలురు సయితము నమ్మకముగా యియ్యఁదగిన ఔషధములను జేయుపద్ధతులను వ్రాయఁబడినది.

ఈపుస్తకము సహాయమున ఎంతమాత్రపు ప్రాథమిక వైద్యజ్ఞానము గలవారయినను తమంతటఁ తామే ఔషధముల చేసికొనగలరని మానమ్మకము. యీ గ్రంథమునందు సుమారు450 పుటలు, 1800 చికిత్సలుచేయుటకు చక్కని తేనెలొలుకు తేటతెనుఁగు పద్యములు బాలురకు సయితము అర్థమగునట్లు అచ్చటచ్చట కఠినపదములకు తెలుగు టీకాతో సహా వ్రాయఁబడినది. ఈగ్రంథమునందలి చికిత్సలలో నొక్కటియైనను గుణమునిచ్చుటకు దప్పినదని రుజువుచేసిన సొమ్ము వాపసు యియ్యబడును.

వెల. రు. 2-8-0

**జనోపకారిణీ ప్రెస్సు, ప్రొద్దుటూరు.**

శ్రీ



# జానకీ ముద్రాక్షరశాల, ప్రొద్దుటూరు.

మన దేశ వ్యాపారస్తులు తమకు కావలసిన హిందీభాషలో కార్డులు, జాబులకాగితములు, హుండీబుక్కులు. మొదలగు అన్నిఅచ్చుపనులకు ఏ బొంబాయికో, బెళగాముకో, లేక పూనాకో పోవలసియుండినది. మా కాతాదార్ల కోరిక పైన పై అక్షరములు, అనేకరకములలో తెప్పించి అనేకులకు ముద్రించియిచ్చుచున్నాము.

తెలుగు, ఇంగ్లీషుభాషలలో, నాటకములు, నవలలు, పద్యకావ్యములు, మొదలగు పుస్తకములు, అచ్చువేయించు వారికి చౌకగను, అందముగను వారుకోరినట్లు చిత్రవిచిత్రములైన తీగెలనువేసి గొప్పవిద్వాంసులచే ప్రూఫులను సవరణలనుచేయించి యివ్వబడును.

పెండ్లిపత్రికలు, వకాలతు మొదలగు ఫారములు, జాబులకాగితములు. దేవాలయపుపత్రికలు, ఆటనోటీసులు మొదలగు అన్నిఅచ్చుపనులు యితరప్రెస్సులకన్న సరసముగ అచ్చువేసి యివ్వబడును. మరియు రోజు, కతామణీ మొదలగు అన్నిలెక్కదస్త్రములు మీరుకోరిన బైండుకట్టి యివ్వబడు.

తాము యితరచోట్ల తమపనిని యిచ్చుటకుముందు మమ్ము కనుగొనుట చాలమేలు.

## మీకుకావలసిన అన్ని అచ్చుపనులు

తెలుగు, హిందీ, ఇంగ్లీషు, భాషలతో



పెండ్లిపత్రికలు, కోర్టుఫారములు, బరాతంచీట్లు, బాండు

బుక్కులు, కౌలు కమ్మ రాజీనామాలు మొదలగు

అన్నిపనులు చాలసరసముగ సకాలమునకు

చేసియివ్వబడును.

## జానకీ ముద్రాక్షరశాల, ప్రొద్దుటూరు